# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 15 మె '72 సంచిక 4

## విషయానుక్రమణిక

చిత్రములు:—

1) కురుక్షేత్రములో గీతోపదేశము: 2) అమెరికన్ రాయబారిభవనమున శ్రీ కెన్నెత్ కీటింగ్ గారు శ్రీవారిని స్వాగతించుట. (శ్రీ సోహన్ లాల్ గారు. డా॥ సూరి భగవంతంగారు శ్రీవారితో వెళ్ళియుండిరి) 3) అమెరికన్ రాయబారి భవనమున శ్రీవారు (శ్రీ ధర్మవీర్ గారు, మి॥ స్టోన్ గారు) 4) మోడరన్ స్కూలు ఆవరణమున మహాసభ: 5) 16, గోల్ఫ్ లింక్స్ రోడ్డు భవనముముందర శ్రీవారి దర్శనముకొరకు ఢిల్లీ ప్రజల ఆతృత 6) శ్రీవారి తల్లిగారు



: హెచ్చరిక :—

ప్రశాంతినిలయమున పాతషెడ్లు ఇండ్లు, తీసివేసి, క్రొత్త షెడ్లు, ఇండ్లు, బ్యాంకులు మొదలైన కట్టడపు పనులు చురుకుగా సాగుచున్నవిగాన, దసరా పండుగకు ఇక్కడకు వచ్చు భక్తులు, దర్శనావకాశములు వసతులు మొదలగు సౌకర్యములు లేక, చాల యిబ్బందుల పాలగుదురని అందరికీ తెలుపవలసినది.

చందాదారులకు విజ్ఞప్తి

రసీదు నంబర్లు TC 4613 నుండి 4865 వరకు చందాదార్లు తమ రసీదులనుచూచి జూలై '72 సంచికనుండి కట్టవలసిన క్రొత్తచందాలు (రు॥4) ఇదివరకు పంపనియెడల, కార్యాలయమునకు జూన్ '72, 15వ తేదీ లోపల చేరునట్లు పంపవలయును.



# రామ కథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

28

దేవీ! నిన్నెవరైనా కష్టపెట్టిరా? లేక ఆరోగ్యము సరిగా లేదా? ఏ క్రూరులైనా నీ అభీష్టమునకు విరుద్ధముగా నడచిరా? చెప్పుము! నీకొరకై నా ప్రాణాపాయమయ్యే పని యైనను వెరువక, ఆనందముగాచేయుదును. నీవుసంశయించకుము. ఓ మంగళాంగీ! నీవెందుల కిట్లు బాధపడుచున్నావు?

సమస్తదేశములు నాస్వాధీనమునందున్న విషయము నీకు తెలియును కదా? ఏ దేశమునందైనను సరే, ఆ దేశ పదార్థములేవైనను కావలయునన్న ఇచ్ఛయే యుండిన,

తెలుపుము, క్షణములో వాటిని తెచ్చి నీకందించి నిన్నా నందపరచు ప్రయత్నము చేతును.

నీవు దేనికి భయపడు చున్నావో దేనికి దుఃఖించు చున్నావో సంకోచపడక తెలుపుము. సూర్యుడు మంచును విడగొట్టినట్లు నీభయమును దుఃఖమును పారద్రోలుదును.

అని అంటూ దశరథుడు కైకను బుజ్జగించుచు బ్రతిమాలుచున్న సమయమును పురస్కరించుకొని కైక మందరచెప్పిన మాటలను మనసున మరువక, ముందు తన భర్తచేత శపథము చేయించనిదే అభిప్రాయము చెప్ప కూడదని నిశ్చయించుకొని, బూటకపు ప్రేమను ప్రద ర్శించుచూ, కంటి నీరు తుడుచుకొనుచూ, కామోద్రేకు డైన దశరథుని హస్తములు పట్టుకొని

దేవా! నాకు యెట్టి కోపమును లేదు. నన్నె వరూ అవమానించలేదు. నిందించలేదు. విదేశపదార్థ ములను నేనంతకంటె కోరుటలేదు. కానీ నాకొక చిరకాల కోరిక కలదు. దానిని మీరు చెల్లింతునని ఒట్టుపెట్టుకొనిన ఆ కోరికేమియో మీకు తెలుపగలను.

అంటూ కొంత చిరునవ్వును ప్రదర్శించిన కైకను గాంచి, దశరధుడుకూడను కొంతమందహాసముతో మరింత చెంతకువచ్చి తలనిమురుచూ, ఓసీ! వెఱ్ఱిరాణీ! ఇంత మాత్రమునకే కొంపమునిగినటుల గోలచేయవలయునా?

స్త్రీలలో నీకంటే ప్రియులును, పురుషులలో రాముని కంటే ప్రియులును ఈ లోకంబున నెవ్వరును లేరు. మీరు ఇరువురూ నాకు ప్రాణ సమానులు. ఇది నీకు బాగుగా తెలియును. ఒక్క దినము నా రాములనూ నిన్నూ చూడకున్న నే నిలువలేను. బ్రతుకలేను: కనుక అట్టి రామునిపై ఒట్టుపెట్టుకొని తెలుపుదును. నీ కోరికేమియో తెలుపుము, తప్పక చేతును.

అని రెండు చేతులు పట్టుకొని దశరథుడు ఒట్టు పెట్టుకొనగనే కైక, అమితానందముతో లేచి కూర్చుని దశరథుడు అనుకూలుడుగా మారినట్లు సంతోషించి మరింత ప్రేమను చూపుచూ,

రాజా! రాముని సాక్షిగా మీరు చెల్లించునటుల శపథము చేసితిరి. ఇది నిజమేనా? అని అడుగుచూ రాజా! మీరు సత్యసంధులు. పరమ ధార్మికులు. మహా పరాక్రమవంతులు. దేవాసురయుద్ధము మీకు జ్ఞాపకముండకపోదు, అయినను నేను మరొకపరి తమకు హెచ్చరింతును. ఆరాత్రి శంబరాసురుడు అందరినీ సంహారము చేయగా, మీరు కడ యూపిరితో బాధపడుచుండిరి. ఆనాడు నేనే మీకు సహాయము చేయకున్న, మెలుకువతో కాపాడకుండిన, మీరేమయి ఉండెడివారో మీకే తెలుసు. అట్టి పవిత్ర త్యాగమునకుమెచ్చి, కైకా! నా ప్రాణమునే కాపాడితివి. అట్టి నీకు నేను ఏమి ప్రత్యుపకారముగా

యివ్వగలను. ఏమయిననుసరే, రెండు వరములు కోరుకొనుము. తప్పక నేను నీకిత్తును. నా కృతజ్ఞత చెల్లింతును.

అని మీరు నన్ను కోరితిరి. అందుకు నేను, మీరు క్షేమముగా బ్రతికినదే పదివేలుగా భావించి, నాథా! నాకేమియూ అక్కరలేదు. కావలసిన సమయమున కోరుకొందును. ఆ రెండువరములు మీ చెంతనేదాచి పెట్టుకొనుడు. నాకవసరమైనపుడు యిప్పించుకొందునని అతి వినయముతో ప్రార్థించితిని. అందులకు తమరు కూడ ఆనందించి నా త్యాగమును మెచ్చుకొని నా జీవితములో యెప్పుడు అడిగిననూ నిధివంటి నీ రెండుకోరికలునూ, యెట్టి అడ్డుచెప్పక అందింతునని తమరు సెలవిచ్చితిరి. ఇవి మీకు మదియందుండియే యుండును కదా!

తమరు భూమినేలు ప్రభువులు. ఆడితప్పనివారు. కాన, ఆనాడు నేను మీచెంత దాచిన రెండువరములు నాకిచ్చి నన్నానందపరచమని ప్రార్థించుచున్నాను. నేను నూతన కోరికలేమాత్రమునూ కోరుటలేదు. ఆనాడు మీరు నాకిచ్చిన కోరికలనే. నావి నాకివ్వమనియే కోరుచున్నాను. దాచిన ధనమును వెనుకకు యివ్వనివారు, మహాపాపులగుదురన్న సంగతి నేను వేరు చెప్పనక్కరలేదు.

అట్లు తమరు వీలుకాదన్న నాకు పరాభవము. ద్రోహముచేసినట్లగును. అట్టి పరాభవమును భరించుట

కంటే ప్రాణములు వీడుట మంచిది. సతికిచ్చిన మాట లనే పతి చెల్లించకుండిన ప్రజల అభీష్టము నెట్లుచెల్లిం చగలరు. సతిని నమ్మించి మోసముచేయు ప్రభువు ప్రజాపరిపాలనకు అర్హుడుకాడు కదా! అట్టివాడు ప్రభువు కాడన్న మను ధర్మము తమరెరుగనిదా!

వేయేటికి ఈనాడు నా కోరికలు నాకు చెల్లించ కున్న సూర్యోదయము లోపలనే కైక ప్రాణములతో ఉండదు అని గోడున యేడ్చుచున్న కైక నటనలకు ఖిన్నుడై, వలనుపన్నిన బోయవాడు కెక వేయగనే జింక పరుగెత్తుకొనివచ్చి వలలోపడినట్లుగా, కైక పన్నిన వలలో దశరథుడు యేమియు తెలియక కామమోహితుడై ఆమె కోరికలకు లొంగి ఉన్మత్తునివలె, ఈ క్షణమునందే నీ రెండు కోరికలను యిత్తునని కైక హస్తము తీసి తన హస్తముతో ప్రమాణము చేసెను.

ఆ మాట వినగనే కైక ఉత్ఫుల్ల నేత్రాలతో దశ రథుని ముఖమునుచూచుచూ, రాజా! మీరెంతమంచి వారో. ఈనాడు నాకర్థమయినది. ఆడినమాట తప్పరన్న సత్యము నేడు సాక్షాత్కరించెను. అని అనేకవిధముల వర్ణించ మొదలు పెట్టెను. అందులకు కాముడైన దశ రథుడు ఉబ్బి కైకా! ఇంకా కాలహరణ మెందుకు కోరుకొమ్మని తొందరపెట్టెను.

కైక, మాటలు తడబడ, రేపటిదినము రాముని

కొరకు యేర్పాటుచేసిన అభిషేక యేర్పాటు వైభవము లన్నింటితో నా కొమరుడగు భరతునకు రాజ్యాభిషేకము చేయించుట మొదటికోరిక; ఇక రాముడు జటాజిన ములు ధరించి, నారవస్త్రములతో దండకారణ్యమున పదు నాలుగుయేండ్లు తాపసునిగా వనవాసముచేసి రావలెను, ఇది నా రెండవకోరిక. భరతుడు నిరాటంకముగా యువ రాజు కావలెను. రాములు ఇప్పుడే నాకళ్ళ ఎదుటనే ప్రయాణము కావలెను. ఈ రెండుకోరికలు చెల్లించి, తాము తమ వంశగౌరవమును నిలబెట్టుకొనుడు, లేదా ఈ క్షణములో కైక మరణమునకైనా ఒప్పుకొనుడు.

అని రాక్షసివలె దిట్టముగాలేచి నిలబడెను. ఈ దారుణమైన కఠినపుమాటలకు మహారాజు దద్దరిల్లిపోయెను ఇది కలయా? లేక నిజమా? ఈ కోరికలు కోరునది కైకయేనా? లేక మరొక పిశాచమా? రెండునూగాక నా చిత్త భ్రమణమా? మనోజాడ్యమా? అని అంతు తెలియనివానివలె కైకా! నీవు కైకవా? లేక కైకరూప మును ధరించిన మహా రాక్షసివా? మొదట తెలుపుము.

అంటూ అవయవములు పట్టుతప్పినవానివలె నోట మాటరాక కదలుటకు దేహము స్వాధీనములో లేక పిచ్చి పట్టినవానివలె అటూఇటూ పిచ్చి చూపులు చూచుచూ, కన్నులనుంచి నిప్పుకణములురాలుస్తూ, కైకవైపు చూచి ఓ దుష్టచారిణీ! ఏమి నీయీ దుర్బుద్ధి నా వంశ

మునే నిర్మూలనముచేయ సంకల్పించితివా? నీప్రేమపుత్రు డగు రాముడు నీకేమపకారము చేసెను? తనతల్లియైన కౌసల్యకంటె అధికముగా నిన్ను ప్రేమించిన నా రాముని కారడవుల కంపుటలో నీ మనసెట్లొప్పెను? ఇంత కాలము నిన్ను రాకొమారివనుకొంటిని. తీక్ష్ణ విషసర్పమును అజ్ఞానమువలన యింటిలో ప్రవేశపెట్టుకొంటిని, నాప్రాణాధారుడైన రాముని సకల ప్రాణికోటియు కొనియాడుచుండగ నీ కెందుకిటి పాపబుద్ధి పుట్టెను ?

అవసరమైతే రాజ్యమునైనా కడకుప్రాణమునైనా వద లగలనుకాని రాముని వదలలేను. వదలను! నీవు నీ కుమారుడు రాజు కావాలన్న చేసుకో! నేను, కౌసల్యా సుమిత్రాదులతో నా రాముని తీసికొని అరణ్యమునకు వెళ్ళెదను. అంతేకాని రాముని మాత్రము ఒంటరిగా అరణ్యమునకు పంపను; అది వీలుకాదు.

ఈ పాపిష్టి కోరికనుమానుకో, రామునిపై కోపము వద్దు. కైకా! నిజముగా నీవీ కోరికను కోరుచున్నావా? లేక నాకు భరతునిపై, నీపై ప్రేమ యున్నదోలేదోయని పరీక్షింపచూచుచున్నావా? పోనీ, నీకుమారునకు రాజ్యాభిషేకము చేయవలెనని కోరవచ్చునుగాని, రాముని అడవులకు పంపమని కోరుటలో అర్థములేదు. తమాషాకైనను పరిహాసమునకైనను ఇట్టికోరిక కోరరాదు. మహాపాపము

కైకా! రాముడు జ్యేష్ఠ పుత్రుడు. మహా గుణ

వంతుడు. అతని పరిపాలనా దినములు మహావైభవముగా నుండును. అట్టి దినములు నే చూడవలెనని కలలుకంటు న్నానని నీవే అనేకపర్యాయములు నాతో తెలిపితివికదా! ఈనాడు అట్టి రామచంద్రుని అరణ్యమునకు పంపమని కోరుటలోగల అంతరార్థమేమి ?

నాతోపరిహాసమాడుచున్నావా? పరిహాసమే అయిన ఈ క్రోధగృహమున ప్రవేశించుటయేమిటి? ఈ కఠిన నేలపై పరితపించుట యేమిటి? పరిహాసమునకుకూడనొక హద్దు ఉండవలెనుకదా? మితిమీరినపరిహాసము మతి చెడినదే కాగలదు. ఇట్టిది పరిహాసమునకైనను నేను భరిం చలేను. రాముని వీడలేను. కైకా! ఇంతవరకు నీవు ఎంత బుద్ధిమంతురాలిగా ప్రవర్తించితివి. ఇప్పుడు నీకు విపరీతపుబుద్ధి పుట్టినది. వినాశకాలము ఆసన్నమగు చున్నందుననే నీకిట్టి విపరీతపుబుద్ధులు పుట్టినవి. మంచి వారికి కీడు తలపెట్టుట మహాపాపము. సత్పురుషులను సతాయించుట రాక్షసకృత్యము. అందువలన మంచివారికి ఎట్టి కీడునూ ఉండదు. దుర్మార్గుల దుష్ట బుద్ధులు సన్మార్గుల కీర్తిప్రకాశములు కాగలవు. కాని ప్రస్తుతస్థితిలో భరించుట, కొంత కష్టముగా తోచును.

ఈనాటి నీ దుష్టతలపులవలన ఇక్ష్వాకువంశమునకే అనర్థము రాబోవుచున్నది. ఇంతవరకు నీవొక్క అనుచిత మైన పనిని కాని అప్రియమైన పనినికాని చేసియెరుగవు.

ఇప్పుడిట్టి కోరికకో న్నావు. నన్ను నేనే నమ్మలేక పోవుచున్నాను. కైకా! నిరంతరము ధర్మభీతి, దైవప్రీతి కలిగిన నీవు ఈనాడు ధర్మభీతిని యెట్లు వదలితివి ? దైవప్రీతిని ఏమిచేసితివి. ధార్మికుడైనరాముని వదునాలు గెండ్లు అరణ్యమునకు పంపుమనుటలో నీయుద్దేశమేమి ?

కుసుమకోమల శరీరుడైన రాముడు సుందరాకారుడైన రాముడు కారడవులలో యెండ, వడగాని బాధలు పడుటచే నీకువచ్చు లాభమేమి ? మనరాజభవనములో వేలాది సేవకులు దాసీలు కలరు. అందులో ఒక్కడైనను రాముడిట్టివాడని అతనిలో ఒక్క తప్పైనను చూపగలవా? పోని. మనరాజభవనమటుంచు, మన నగరమున రాముని యందు తప్పు ఒక్కటైనను చూపెట్టగల వానిని తేగలవా? చూపగలవా? అనేక ఏనజనులకు తానే వనమునిచ్చి, ఆదరించి, దరిద్రులనుజూచి వారికి గృహ వసతులు కల్పించి, అనేక విధముల ఆదరించి ప్రజా ప్రేమను చూరగొన్న రాముని నీవు ద్వేషించుటలో ఎంత కిరాతకు రాలవో చెప్పలేకున్నాను.

అనేక విధముల ప్రజలను పీడించి తమ స్వార్థమును లక్ష్యమందుంచుకొని, తమ మంచినే తాము చూచుచూ. ప్రవర్తించే కిరాతకులా 'చెడు మంచిగా' కనిపించుచున్నారు. దీనులను, దరిద్రులను ఆదరించి, అనుకూలములు సలిపి వారల యోగక్షేమములను స్వయ

ముగా విచారించి, ప్రజామేలును, ప్రజాక్షేమమును కోరి ప్రవర్తించువారు చెడ్డవారగుట యుగదోషమా, లేక నా పాప ఫలమా ?

సమస్త జనులు రాముని గుణగణములను వర్ణించుచూ. పొలములందు సహితము తమ పనులలో అలసట కలిగినపుడు ఆ బాధను భరించునిమిత్తమై రామ గుణములను పాటలుగా పాడుచున్నారన్న వార్తలు విని నేనెంతయో సంతోషించుచుందును. అట్టి దయామయునకు ఈ దారుణ శిక్షనిచ్చుటకు నీకు మనసెట్లొప్పెను?

నేటి సాయంకాలము పురప్రముఖులను, ఋషులను మహనీయులను, మంత్రులను, పండితులను అనేకమంది తెలివితేటలు కలవారిని అందరినీ ప్రోగుచేసి రామాభిషేక విషయమై హెచ్చరించగా చేరినవారిలో నొక్కడైననూ, అసంతృప్తిని తెలుపక, అనేకరకముల రాముని కొనియాడిరి. అట్టి జితేంద్రియుడు, త్యాగమూర్తి, సత్యవ్రతుడు అయిన రాముడు మా ప్రభువు కావటము మాపూర్వజన్మ పుణ్యమని జేజేలు తెలిపిరి.

అట్టి ప్రజామన్ననలనందుకొన్న నా ప్రేమరాశిని అరణ్యమునకు పంపమని కోరుదువా ? నీవేమైనను సరే నేను నా రాముని అడవులకు పంపను. అంతియేకాదు, రేపటి దినము రామ పట్టాభిషేకము తప్పదు, అని మొండి ధైర్యముతో తెలుపుచున్న దశరథునిచూచి,

కైక, అమిత రౌద్రాకారమును ధరించి, రాజా! నా రెండువరములు చెల్లింతునని కొన్ని నిమిషములకు పూర్వము తాము అనేక ప్రమాణములుచేసి, ఇప్పుడు నా వరములు చెల్లించుటకు వెనుకంజ వేయుటలో యిక్ష్వాకుల వంశమునకు అపకీర్తి తెచ్చునది మీరా? నేనా? బాగుగా విచారించుకొనుడు. ఆడినమాటలు తప్పనివారే యిక్ష్వాకువంశజులన్న బిరుదునకు మీరే కళంకమును కలిగించుచున్నారు.

ముందు వెనుక యోచించక, తప్పక నీ వరములిత్తునని తెలిపినట్టి తప్పు మీదేకాని నాది కాదు. ఆనాడు యిచ్చినది. నేడు యిచ్చినది మీరే. మీరిచ్చిన వాటినే మీరు వమ్ము చేయుటలో మీ ఘనతను మీరే యోచించుకొనుడు.

అబలను మోసపుచ్చుట, ఆడినమాటను తప్పుట, పరిపాలకులకు తలవంపులేకాని గౌరవ ప్రతిష్ఠలు కాజాలవు. ఆడినమాటలనుతప్పి అంగనలను వంచించువారు మహా కిరాతకులేకాని, ప్రభువులు కాజాలరు. ప్రభువులే యిట్టి కిరాతక చర్యలకు పూనుకొన్న ప్రజల కడగండ్లకు అంతుండదు. అట్టి రాజ్యము రాక్షస రాజ్యమునకు సరి.

( సశేషము )



# అందరూ, నావారే

మేము 25 వ తేదీని ఢిల్లీ చేరినపుడు ప్రజల ఉత్సాహము యెంత తీవ్రముగానుండినదంటే. ప్లేనునుంచి క్రిందికి దిగివచ్చుటకే అర్ధగంట పట్టినది.

ఢిల్లీలో ఒక నిమిషముకూడ వ్యవధిలేకుండ లక్షలాది ప్రజలకు ఆనందమునందించే పనిలో నేను నిరతుడనయితిని. రాత్రింబగళ్ళు భజనలు జరిగినవి. ఆ సమయమున భక్తులకు దర్శనమిచ్చి. వారితో వచ్చిన రోగులకు ఆశీస్సులందించి తృప్తి పరచితిని.

ఉదయమునుంచి రాత్రి పన్నెండు గంటల వరకు రోడ్లు పూర్తి ఇసుక వేసిన రాలని రీతిగా జనులు క్రిక్కిరిసియుండిరి. అయితే 12 గం॥ల తరువాతకూడ. క్రొత్త గుంపులు.... జలంధర్ మీరట్. పాటియాలా. ఆగ్రా మొదలైన ఊళ్ళనుంచి లెక్కలేనన్ని బస్సులలో వచ్చి "సాయిబాబా! దర్శన్ దేవ్ ...." అని ఆవేదనతో ఒకే అరపు! రోడ్లంతా కారులతోను. బస్సులతోను నిండిపోయెను. కాబట్టి. వాళ్ళను నేనుచూచి వాళ్ళకు దర్శనమిచ్చి రాకపోతే. వాళ్ళ వెనుక నిలిచియున్న గుంపులకు. ముందుకు వచ్చేందుకు చోటులేదు। దానివలన. నేను లోనుంచి మరిమరి వచ్చి వాళ్ళను ఆనందింపజేయవలసి వచ్చినది.

ఈ రీతిగా తెల్లవార్లు 3-30 వరకూ జరిగినది. ఇంకేమి! బ్రహ్మముహూర్తమునకు నగర సంకీర్తనము ప్రారంభము కదా! పెద్దపెద్ద గుంపులుగా మైళ్ళకొలది పొడవున రోడ్డుమీద భజన. ఢిల్లీ పూర్తి ఉజ్జాత లూగినది. ప్రభుత్వములోని మినిష్టర్లకు, అధికారులకు, సామాన్యప్రజలకు, రిక్షాకూలీలకు, బీదలకు, పాకీజ నులవారికి, అందరికీ ఆనందము నందించి అనుగ్రహించుట మైనది.

ఇట్లు, వారి ఆనందమును నేనందుకొంటూ, నా ఆనంద మును వారందుకొంటూ ఉన్నప్పుడు, గుల్జారీలాల్‌నందా వచ్చి కురుక్షేత్రమున అఖిల భారత సాధుసమాజమువారు జరిపే ఒక మహాయజ్ఞమును స్వామి చేతులతోనే ప్రారంభించాలి అని గట్టిగా పట్టు పట్టాడు. ఇంత పెద్ద ప్రవాహముగా ఢిల్లీకి కొండంత ఆశతో వచ్చే భక్తజనులను వదలి వారిని నిరాశ పెట్టేది నావలన కాదు అని నేను చెప్పినపుడు, వారితో వీరితో స్వామికి చెప్పించే ప్రయత్నమునకు పూనుకొన్నాడు. మీ రాజకీయములో రిక మెండేషనులకు చోటుండవచ్చునేకాని, నా భావమును. నా విష యమును సరిగా అర్థము చేసికొన్న, మీకే తెలియును, అట్లు రెకమెండేషనులను వినేవాడనుకాదు నేను; అన్నాను. అయితే ఆయన, నాచేతనే ఆ యజ్ఞమునకు ప్రారంభోత్సవము జరిపించ వలెనను పెద్ద ఆశ పెట్టుకొన్నాడని తెలిపినది. నా అనుగ్రహ మునకు పాత్రుడు కావటము తనకొక అమితానందమును అందించే భాగ్యమని భావించినాడు. తన సర్వస్వమును.

సాధు సమాజమునకే త్యాగము చేయవలెననే మహోద్దేశము తోనున్నాడు కాబట్టి, ఆయనను సంతృప్తి పరచవలెనని సంకల్పించి. మధ్యాహ్నము రెండు గంటలకు (ఆ మండుటెండలో, పైన, క్రింద మాడిపోవును కాబట్టి యెవరూ యెక్కువగా వేచియుండరని, యెక్కువమందికి నిరాశ కలుగదని నిర్ణయించి) అచ్చటకు వెళ్ళాను.

కురుక్షేత్రమును చేరితే, యెక్కడచూచిన, ఈ (సన్యాసి) కలరే! కాషాయవస్త్రధారులే, 3 లక్షలకు పైగా ప్రజలుచేరియుండిరి. నా కేదోకొంత ఆనందము కలిగినది. ఆనందముతోపాటు వాళ్ళకు కావలసిన ఆదేశముల నందించవలెననే ఉత్సాహముకూడా కలిగినది.

భారతదేశమును తలంచినపుడు హిమాచలము, దానినుంచి యుద్భవించు గంగయు జ్ఞప్తికి వచ్చును. సత్య ధర్మ శాంతి అహింసలే హిమవత్‌తత్త్వము. గంగయొక్క నిర్మలవాహినియే ప్రేమ తత్త్వము, ఇట్టి నిశ్చలమైన హిమవత్ పర్వతమును ఇట్టి నిర్మలమైన గంగా తత్త్వమును రాజకీయాలద్వారా నాశనము చేయుటకు ప్రయత్నములు యెంత కాలము జరిగినను యెన్ని రకములుగా జరిగినను ఫలించవు అని వారికి ధైర్యము నందించితిని. లోన కషాయము పెట్టుకొని పైన కాషాయము ధరించిన యేమీ ప్రయోజనముండదని హెచ్చరించితిని.

తరువాత. ఒక దినము ఉత్తరప్రదేశ్ రాష్ట్రమందున్న మీరత్ నగరమునకు వెళ్ళియుంటిని. అక్కడకూడ యెవరికీ

తెలుపక పత్రికలలో వేయక వెళ్ళినను, చుట్టూ వృక్షములపై కొమ్మకొమ్మలకు కోటి చీమలు అన్నట్లు ఇరుప్రక్కల లక్షలాది ప్రజలు కూర్చొనిరి. వేదిక దగ్గరకు మేము పోవుటకే వీలులేని పరిస్థితి. మనవాళ్ళందరు తిరిగిపోవుటే మంచిదన్నారు. అయితే నేను కారెక్కినపుడు ఆ భక్తుల రోదనము విని నేను దిగి జనసందడిలో దూరి ఒక్కడనే యెవరికి తెలియకుండ వేదికయెక్కి దర్శనము నందించితిని. కొన్ని భజనపాటలతో వారిని శాంత పరచితిని.

"ఈ ఇరువదవ శతాబ్దమున భారతదేశపు రాజధానియూ నవనాగరికతయొక్క కేంద్రస్థానమూ అయిన "ఢిల్లీలో ఈ ఐదడుగుల స్వామిని దర్శించే కొరకు వారి ఆశీస్సులను పొందే కొరకు ఐదు లక్షలమంది చేరారంటే నిజముగా భారతదేశములో ఆధ్యాత్మికపిపాస ఆధ్యాత్మికావేదన, ఆధ్యాత్మికతృష్ణ క్రొలితీవ్రముగా సజీవముగానున్నదని నేను తెలిసికొన్నాను" అని అమెరికన్ అంబాసిడర్ కెనెత్ కీటింగ్‌గారు సంతోషించి పలికిరి.

దైవభక్తి, ఆధ్యాత్మిక శ్రద్ధ, భారతీయుల రక్తమునచేరి శతాబ్దములనుంచి సతతము ప్రవహింపుచునేయున్నదని నాకు తెలియును. ప్రేమపలుకులు, ప్రేమదృష్టి, ప్రేమసృష్టి, వీటికి అపజయమనేదేలేదు. రామ, నాకెక్కడనూ దిగ్విజయమే. ఎందుకనగా అందరూ నావారే, నాకు పరాయివారే లేరు.

శ్రీవారి దివ్యోపన్యాసమునుంచి
ప్రశాంతినిలయము 8-4-72

# భారత రాజధానిలో భగవాన్



స్వామి ఢిల్లీ ప్రయాణము చాలకాలము క్రిందటనే జరుగ వలసియున్నది. ఏమనగా స్వామి ఢిల్లీలో కాలిడి చాల యేండ్ల యినది. స్వామి విషయము సరిగ తెలియని చాల సంవత్స రములకు పూర్వము ఋషీకేశము. కాశ్మీరు, బదరీ వెళ్ళుత్రోవలో స్వామి ఢిల్లీలో కొద్దిరోజులు ఆగి యుండిరి.

కాని ఈ మధ్య పంజాబు, హర్యానా, హిమాచలప్రదేశ్ ఢిల్లీ, ఉత్తరప్రదేశ్‌లలో స్వామిపేరు మార్మోగుటయేగాక ఆయా రాష్ట్రములయందలి భక్తాదులు తండోపతండములుగా వచ్చి ఢిల్లీకి రావలసినదిగాను దర్శనాతురులగు వేలాది భక్తులను అనుగ్రహిం చవలసినదిగాను స్వామిని ప్రార్థించిరి. భగవాన్ ఎట్టకేలకు సమ్మ తించుటయు; ఆ శుభసమయము మొన్న మార్చి 25, 1972 న సమకూరుటయు స్వామి విమానములో ఆ దినమున ఢిల్లీ చేరు టయు తటస్థించినది.

అంతకు క్రితమే భక్తులు కొందరు స్వామి ఢిల్లీ ప్రయా ణమును గురించిన ఏర్పాట్లను చర్చించుటకు బెంగుళూరు వచ్చి యుండిరి. మాజీ పార్లమెంటు మెంబరును సుప్రసిద్ధ వ్యాపా రస్తుడునగు శ్రీ సోహన్‌లాల్‌యొక్క ఢిల్లీగృహము నెం. 16 గోల్ఫ్‌లింక్స్ రోడ్డులో స్వామికి వసతిగా నిర్ణయించిరి. ఢిల్లీ

హిమాచల్‌ప్రదేశ్‌లలోగల శ్రీ సత్యసాయి సేవాసంస్థలకు శ్రీ సోహన్‌లాల్‌గారు అధ్యక్షులు. ఆయన యేర్పాటులను ముగించుకొని స్వామితో కలిసి ఢిల్లీ ప్రయాణముచేయుటకు హైదరాబాదు చేరుకొన్నారు.

పాలమ్ విమానాశ్రయమువద్ద తన్ను స్వాగతించుటకు భక్తులు గుమిగూడ వలదని భగవాన్ ముందుగనే హెచ్చరించినారు. ప్రత్యేకించి ప్రజా సమూహము తప్పించుకొనుటకై ప్రొద్దుటి ప్రయాణమును మార్చి సాయంత్రము ఢిల్లీ చేరునట్లు టిక్కట్లు తీసికొనిరి. స్వామి విమానమునుంచి దిగు సమయమునకు విమానాశ్రయము వద్ద యిద్దరు ముగ్గురు సమితి కార్యకర్తలు ఉండుటకును. మిగతావారందరు 16, గోల్ఫ్‌లింక్స్ రోడ్డువద్ద సమావేశమగుటకును ఏర్పాటు జరిగినది. స్వరచివరీతి తూ.చ. తప్పక పాటింపబడినది.

అయితే విమానాశ్రియమువద్ద భక్తులగుంపులు తప్పలేదు. ఈ భక్తులెవరు? పోలీసు, కస్టమ్స్ ఉద్యోగులు వారివారి కుటుంబములు, విమానాశ్రయపు ఆవరణము యావత్తు, విమానము నుంచి దిగుమెట్ల పర్యంతము క్రిక్కిరిసి భగవానునికొరకై వేచి యుండిరి. అతి కష్టముతో సమ్మర్దమునుంచి స్వామికి బయటకు త్రోవచేయగా రైల్వేమంత్రి శ్రీ కె. హనుమంతయ్య గారితో కలిసి కారులో భగవాన్ 16, గోల్ఫ్‌లింక్స్ రోడ్‌కు ఆగమించిరి.

క్రమశిక్షణ నుల్లంఘించుట స్వామికి సమ్మతముకాదు. భక్తులుకాని మరి అనురక్తులుగాని, తొందరత్రొక్కిడులతో అధికారు

లకు అసౌకర్యము కలిగించుట స్వామికి యిష్టముకాదు.

దీర్ఘకాలికమయ్యే కారుప్రయాణమువలె విమానయానము స్వామి అంతగా అభిలషించినట్లు తోచదు. సరస సంభాషణలతో, ఆధ్యాత్మిక చర్చతో, భజనపాటలతో, ఏకొద్దిమంది అంతరంగిక భక్తులసాంగత్యముతోనో, సాగు కారుప్రయాణమే స్వామికి ప్రీతి. కాలము యిట్టే గడచిపోవును. విమానమన్ననో ఒక నిర్బంధ వాతావరణము. ఏ పుస్తకపు పుటలనో తిరుగవేయుచు కండ్లుమూసికొని ఆత్మావలోకనముతో కాలము పుచ్చుదురు.

విమానమందు కూడ స్వామికి భక్తులబృందము తప్పదు. స్వామి పాదములనంటగోరు ప్రయాణీకులను విమానమునునడుపు నిర్వాహక బృందమును (కెప్టెన్, పైలట్, ఎయిర్ హోస్టెస్) స్వామికరుణకు పాత్రులే. వారిని తగువిధముగ ఆశీర్వదించి ఆనందింపజేయుదురు.

స్వామి 16, గోల్ఫ్‌లింక్స్ రోడ్ చేరుసరికి అచ్చట దీపాలంకృతమై శోభాయమానముగ సింగారింపబడిన పందిరియందు పేనకువేలు భక్తులు ఆశీనులై వేచియుండిరి. ఒక పార్కును పందిరిగా తీర్చిన ఆ తావున సుమారు పదిహేనువేలమంది జనానీకము స్వామికి దిక్కులు పిక్కటిలునట్లు జేజేధ్వానములతో అఖండస్వాగతము పలికిరి. ఆరాత్రి స్వామి విశ్రాంతి గృహమునకేగు సరికి 11-30 గంటలాయెను.

మరునాడు ఉదయమున పదిహేనువేలమందికి మాత్రమే

నిలబడుటకుగాని కూరుచుండుటకుగాని అనువుగా పొందుపరచిన ఆ పందిరి ముప్పదివేలమంది జన సముదాయముతో కిటకిటలాడు చుండెను స్థలముచాలక పుట్టలుపుట్టలుపకై ఆ తీర్థప్రజ రోడ్ల పైనన్ని దిక్కులకు వ్యాపించగా వారి నిమిత్తమై తినుబండార ముల అంగడులు హోటల్సు రాత్రికిరాత్రి వెలసెను.

ఉత్తరప్రదేశ్, పంజాబు హర్యానా, హిమాచలప్రదేశ్ నుంచి అసంఖ్యాకముగా వచ్చిన బస్సులను బారులుతీర్చి నిలిపిరి. ఆయా ప్రాంతముల ప్రజలకు నగరవాస్తవ్యులు మార్గదర్శులై స్వామి సందర్శనోత్సాహమునకు అగ్రగాములై చేచియుండిరి.

అట్లున్న వేలాదిజన మధ్యమునకు భగవాన్ వచ్చి దర్శన మిచ్చెదరనియు, వారి చరణముల నంటుటకై ప్రజలు గుమిగూడ రాదనియు ఎవరికివారు వారివారి మనస్సులయందే స్వామికి నమ స్కృతుల నర్పించుకొనుట ఉత్తమమనియు లౌడ్స్పీకరులలో ప్రకటించిరి.

తదనుసారము స్వామి దర్శనము కాగానే ప్రజల జయ జయ ధ్వానములు మిన్నుముట్టెను. రోగులకు విభూతిని ప్రసా దించుచు, ఉత్తరములను కైకొనుచు. ప్రేమపూరిత దృక్కులను సారించుచు స్వామి ప్రజలను హర్షపులకిత శరీరులుగా చేసిరి. స్వామికి లేఖలందించుటకుగాని స్వామి పాదస్పర్శ చేయుటకు కాని క్రమశిక్షణను పాటించక ముందుకు ఎగబడువారి పంక్తు లను వదలి వేరొకపంక్తికి స్వామి నడచుచుండుటచే నియమి

ములను ఉల్లఘించువారలకు అదియొక చక్కని గుణపాఠ మయ్యెను. కొద్దిమందియొక్క అనుచిత ప్రవర్తనచే స్వామి సామీప్యదర్శనము కొన్నికొన్ని పంక్తులకు అలభ్యముకాగలదు అను అంశము సువిదితమాయెను. ఆవచ్చిన వేలాదిజనమును నియమ బద్ధముగా కూర్చుండపెట్టుట అసాధ్యమేమోనని శ్రీ సోహన్‌లాల్ చెప్పినమాట సత్యదూరముగాదు. అట్టి సమయ మున ప్రతియొక్కరును నియమములను పాటించి వారివారి స్థాన ములయందు వారు కూర్చుండగా ఆ మహాజనమధ్యమున స్వామి తిరుగాడ గలుగుటకు వారందరిపై ప్రసరించిన భగవానుని ప్రేమ కారణమనుట నిర్వివాదము.

పిమ్మట ఆ రోజుకు స్వామి ఎవరికిని ప్రత్యేకదర్శనము నొసంగలేదు. దూరదూరములనుంచి యేతెంచిన అసంఖ్యాకమగు ఆ ప్రజానీకమునంతను తృప్తిపరచుటయే స్వామి ఆశయము. కావున అందరును చూడ వీలగునట్లు అచ్చటి మేడమీద పైభాగ మందు స్వామి పలుమార్లు కనబడుచువచ్చి సుందర వదనార విందమున మందహాసము చిందులాడ వారలను తమ అభయ హస్తముతో ఆశీర్వదించుచుండిరి. పరవశత్వమున వారు "సాయి బాబాకీ జయహో" అను నినాదములుచేయ, స్వామి తన హస్త మును పెదవులపైనుంచుసరికి ఆనందమును అంతర్గతమొనరను భవించవలయునను సంజ్ఞార్థమును గ్రహించిరి. కాని అప్ప టికినీ జనులలో కొందరి "సాయిబాబాకీ జయహో" నినాదము తగ్గలేదు. స్వామిని వెలుపలికి రప్పించుట కదియొక 'కీ' యని

తలంచిరి కొందఱు.

తాను తలచిననే స్వామి దర్శనమనుగ్రహించును కాని. ఆర్భాటములకు స్వామి వశులుకారను విషయము అనుభవము వలన వారు గ్రహించునట్లుచేసి వారి అపోహలను శీఘ్రమే తొలగించిరి. పై అంతస్తు ప్రాంగణముపై స్వామి రోజుకు ఏడెనిమిదిసార్లు ప్రజలకు దర్శనమిచ్చిరి. రోజురోజుకు స్వామి విషయము జనులకు గ్రాహ్యమగుచువచ్చినను ఏప్రిల్ 2, ఆది వారము ఉదయమునకు అచ్చటజేరిన జనులు విపరీతముగ పెరిగి సుమారు లక్షయాభైవేలమంది రోడ్డునకు అటుప్రక్క ఒకమైలు, ఇటుప్రక్క ఒకమైలు, విస్తరించి యుండుటవలన స్వామి జన మధ్యమునకు వెళ్ళుట అసంభవమాయెను. జనుల ఒత్తిడికి కాంపౌండు గోడల కమ్ములుగాని ఇనుపతలుపులుగాని ఆగలేదు.

ఢిల్లీప్రజలకు స్వామి దర్శనము అది ఈ ప్రయాణమునకు కడసారియని తెలిసియుండుటచే, ప్రతివారును స్వామికి తమతమ విన్నపములనందించ వలయుననియో స్వామియొక్క పాదములకు నమస్కారము చేయవలయుననియో తహతహలాడుచుండిరి. అట్టి అసాధారణ పరిస్థితులలో సౌధోపరిభాగమున సుమారదర్శన మొసంగుటయు సాయంసమయమున స్వామి సందేశము భజనగీతములు ఉండునని ప్రకటించుటయు తప్ప అన్య పరిష్కారమార్గము కానరాదయ్యెను. సాయంకాలపు సమావేశమునకు తగురీతిని తయారైవచ్చుటకుగాను అప్పటినుంచి జన బాహుళ్యము క్రమముగా తగ్గ మొదలిడెను.

మొదటి రెండు రోజులు రోగార్తులను ఆశ్వాసించుటకు వీలు చిక్కాదమ్మేము. ఉప్పెనవలె ఉప్పొంగు ఆ జన సముద్రమును దర్శనముచేతనే శాంతపరచుటకు సాధ్యమాయెను. కొంత శాంతి సమకూరినపిమ్మటకాని రోగపీడితులను, వికలాంగులను యెంచి ఆంతరంగిక దర్శనమునకు అనుమతించుటకు వీలు లుగలేదు. పోలియోతోపడిపోయిన పిల్లలను. ఊనుపుల్లలవలె కాళ్ళు కలిగి చక్రపు కుర్చీలలో తీసికొనిరాబడిన వృద్ధులను. జీర్ణవ్యాధులతో క్రుంగి కృశించిన స్త్రీలను. చర్మరోగములతో దీనవదనులగు మధ్యవయస్కులను వీరందరిని స్వామి స్వయముగ సమీపమునకు పిలిచి, ప్రసాదమొసంగి, వారివారి భగ్న జీవితములను ధైర్యముతో యెదుర్కొను మనోబలమునొసంగి కరుణించిరి. కొంతమంది వికలాంగులను స్వామి నడిపించిరి నమ్మకము కోల్పోయిన ఆ నైరాశ్యులలో విశ్వాసమును చిగురింపచేసి అద్భుతములనుకూడ సాధింపజాలు శక్తిని ప్రసాదించిరి.

సామాన్యజనములకు తరచు దర్శనమునొసంగి రోగపీడితుల నాశ్వాసించు నిమిత్తము కార్యనిమగ్నులగుటవలన స్వామి ఢిల్లీనగరమందలి శ్రీ సత్యసాయి సేవాసమితి కార్యకర్తలందరి యిండ్లకు వచ్చు అదృష్టమునకు నోచుకొనలేదని పలువురు భక్తులు కంటనీరు పెట్టుకొనిరి.

"స్వామీ! మీరు మా యింటికి రాలేదని నా భార్యా బిడ్డలు అన్నముకూడ ముట్టుటమాని విచారగ్రస్తులైయున్నారని ఒక

సన్నిహిత భక్తుడు స్వామిని వేడుకొనగా కాదామరి చూడు ఈ వేలాది స్త్రీలు. పదియు గంటలతరబడి కాలే మంటలో ఆకలిదప్పులను లెక్కచేయక నన్ను దూరమునుంచియైననుసరే చూచుటకు సంసిద్ధులై యున్నారే, వారి ఆసక్తి అత్యుతలుమీకి పుడు బాగా అర్ధము కాగలదు " అని స్వామి. ఆ భక్తుని ఓదార్చెను.

అట్లనిరేకాని స్వామికృప అపారమగుటచే మధ్యాహ్నము విశ్రాంతిసమయము మొదలు అర్ధరాత్రివరకు సమితికార్యకర్తలను వారి కుటుంబములను వారివారి యిండ్లలో చూచిరి. ఇండ్లకు వెళ్ళనివారి కుటుంబములు స్వామి దనచేసిన 16. గోల్ఫ్‌లింక్స్ రోడ్డునకు ఫలహారాది వంటకములను వారివారి యింటినుంచి తెచ్చిరి. అట్టివారికి స్వామి వడ్డనచేయు మహాభాగ్యమును ఒసంగిరి. అట్టి సమయములో శ్రీ సోహన్‌లాల్‌ను. అతని కుటుంబమును స్వామి తనతోపాటువారును ఆ యింటిలో అతిధులేనని చమత్కరించిరి.

ఢిల్లీలోనుండిన కొద్దిరోజులలోను సమితి కార్యకర్తలను. నిరంతరము పనిచేసిన వాలంటీరులను యావన్మందిని స్వామి పిలిచి మాటలాడిరి. స్త్రీలనక, పురుషులనక, వాలంటీర్లందరు మిక్కిలిగా శ్రమకోర్చి పనిచేసిరి. స్వామి పాదములనంటు ఉత్సుకతతో పైబడు ప్రజాప్రవాహము నరికట్టుటయు, తెల్లవారు జాము 3 గంటలు మొదలుకొని స్వామి దర్శనము కొరకై గంటల తరబడి ముందుగావచ్చి కాచికొనియున్న వస్త్రీలకు

సౌకర్యము చేయుటయు దగ్గర దర్శనము కోసమై కాంపౌండు గోడల కమ్మీలను, ఇనుపద్వారపు తలుపులనుకూడ విరుగగొట్టి వచ్చిపడు ప్రజానసముదాయమును వారించుటయు మొదలుగాగల క్లిష్టబాధ్యతలను వాలంటీర్లు సక్రమముగా నిర్వర్తించి ప్రశంసాపాత్రులైరి.

వచ్చినవారిని కూర్చుండజేసి కూర్చునియున్నవారికి మంచి నీరందించి ఏ నియమములను పాటించ నోర్వని అప్రతిభులను శాంతపరచి ఓర్మితో. కుశలతతో స్త్రీవాలంటీర్లు సేవాధర్మమును నెరవేర్చిరి. ఎప్పటికప్పుడు 'మైకు'లో కంఠమాధుర్యముగల ఒకరు విసుగులేక మృదువుగా ప్రకటనలు చేసిరి. సేవాదళ కార్యకర్తలు వాలంటీర్లకు గుర్తురుమాళ్ళనుపంచుచుండగా వారికవి స్వామియే స్వయముగా ఈయవలయునని కోరికగలుగుటచే స్వామి తత్ప్రకారము గావించి వారి అభీష్టమును చెల్లించి వారిని ఆనందపరచిరి.

స్వామిగదిచెంత ద్వారపాలకసేవచేసిన వాలంటీరులకది యెంతయో ఆనందానుభవము. వారాపనిని ఎంత మెలకువగా నిర్వర్తించినను ఒకపరి ఒక అమెరికన్ హిప్పీ ఆ భవనములో ప్రవేశించుటయేకాక స్వామిగదిలోనే చొరబడ సిద్ధమాయెను. అప్పుడు యేర్పాట్లను మరింత కట్టుదిట్టముచేసి యేమరుపాటులేని ఉత్సాహముతో హెచ్చరికతో పనిచేసిరి.

స్వామియు వారి నిస్వార్థసేవకెంతయోమెచ్చి ప్రీతితో

వారి యోగక్షేమముల నరసిరి. తక్కువమార్కులవలన పెద్ద చదువునకు అంతరాయము కలిగి దిగులొందిన ఒక వ్యక్తి మనోభీష్టము నెరవేరునట్లు ఆశీర్వదించిరి. త్వరలో పెద్దపరీక్ష లకుకూర్చుండబోవుచున్న మరొక విద్యార్థి వాలంటీరుయొక్క శ్రద్ధ లోపమరసి ఒక పెన్నును సృష్టించి పరీక్షలను ఆ పెన్నుతో వ్రాయమని ఆదేశించిరి.

ఈ విధముగా వీరు వారనక వచ్చిన యావన్మందియు సమితివారు, మహిళావిభాగమువారు భక్తిశ్రద్ధలతో, విశేషభక్త్యు త్సాహములతో పనిచేసి స్వామి ఢిల్లీయునికిని చిరస్మరణీయము చేసిరి. శ్రీ సోహన్‌లాల్ కుటుంబీకులును రాత్రింబగలనక నిర్విరామముగా చిన్నపనిమొదలు పెద్దపనివరకు సావధానముగా నెరవేర్చిరి.

16, గోల్ఫ్‌లింక్స్‌రోడ్ వద్ద ఏర్పరచిన పార్కు పెండాలు మొదటిరోజుచేరిన ప్రజానసమూహమున కెంతయు చాల దయ్యెను. ఢిల్లీలోగల సువిశాలమగు నేషనల్ స్టేడియమ్ ఆటలకారణమున వీలుగాక పోవుటచే ఇచ్చటగల పార్కునకు రెండింతలు ఆవ రణ కలిగి సుమారు 50 వేలమంది జనము పట్టు మోడరన్ స్కూలు మైదానమందు సభలను ఏర్పాటుచేయ సమితివారు సం కల్పించిరి. కాని మార్చి 27 వ అంతు జరిగిన సమావేశ మునకు ఏవిధమగు ప్రచారప్రకటనలు లేకయే సుమారుఒకటిన్నర లక్షల జనము చేరిరి. ఏర్పాటుకర్తల అంచనాలు అన్నివిధముల అతిక్రమించినవి. కూర్చుండినవారు వేనకువేలుగా నుండగా

వారి చుట్టూ విలబడియున్నవారు మరి వేనకు వేలు.

స్వామి ఇచ్చటికి రాగానే సమీప స్థలమునకై వేదిక చుట్టు అసంఖ్యాక ప్రజమూగిరి. చేసిన యేర్పాట్లు సర్వస్వము అస్తవ్యస్తమగు పరిమాదమేర్పడెను. కాని స్వామి సమ్మోహన మగు "ప్రేమ ముదిత మనసె కహో" ఇత్యాది భజన గీతము లతో ఉత్తేజకరమగు దివ్యోపన్యాసముతో సంకులము సద్దు అణచిరి. నానా దేశములతో కూడిన ఈ ప్రపంచమునే ఒక "ట్రైన్" గాను, భారతదేశమునుదాని 'ఇంజన్' గాను. ఈ అవతారమే ఆ "ఇంజన్ డ్రైవరు" గాను స్వామి తమ ఉప న్యాసములో వచ్చాటించిరి.

డా॥ యస్. భగవంతం. D.Sc. గారు స్వామి ఉపన్యా సమును హిందీలో తర్జుమా చేసిరి. ఉపన్యాస వేదికనుంచి హిందీ భాషభాషలో మాట్లాడుట భగవంతంగారికి ఇదే మొదటిసారి. ఆయన యింతకుముందా భాషలో ఏ విధమైన పరిశ్రమకూడ చేయలేదు. అట్టి అనభ్యాసకృత భాషాంతరీకరణమే శ్రీవారి మహిమవలన జరిగిన ఒక అద్భుతమని చెప్పకతప్పదు. తర్జు మాతో స్వామిభావము తెలియగా. స్వామి పలుకుల తీపి, అంగ విన్యాసములతో ఉపన్యాసము. శ్రోతలనాకట్టెను.

స్వామి సందర్శనము స్వామి సంభాషణము ఢిల్లీప్రజ లను పై విధముగా ప్రభావితులను చేసెను. స్వామిని క్రియా పూర్వకముగా చూచిగాని స్వామి మహత్పూర్ణ మహద్భుతమును నమ్మలేని కొందరికి ఆ సాయంకాలపు సమావేశము ఒక అపూర్వ

విదర్శనమయ్యెను ఒక ఆధ్యాత్మిక సత్సంగ ప్రసంగమునకు అన్నివేలమంది ప్రజ ఒకచోట చేరుట ఢిల్లీ చరిత్రలో మున్నెన్నడు కని, విని, ఎరుగని సంఘటన.

ఈ మాట యదార్థము. దేశ రాజధానిగా దేశమందలి రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మికోద్యమములన్నిటికివీ ఢిల్లీ ప్రతిబింబప్రాయము, మరియు ప్రమాణ నిర్ణయకేంద్రము. ఢిల్లీలో విజయము సాధించిన, యావద్భారతావనిని జయించినట్లే. సార్వభౌములయు, సామ్రాజ్యములయు ఉదయాస్తమయములు శతాబ్దములుగ జీర్ణించుకొన్న ఢిల్లీనగరమునకీ ప్రత్యేకత అప్రతిమానము.

మోడరన్ స్కూలు మైదానమున జరిగిన సమావేశము ఢిల్లీనగర సామాన్యపౌరుని కుతూహలమును రేకెత్తించి తృప్తిపరచగా, "కమానీహాలు"లో జరిగిన సమావేశము ఢిల్లీపుర ప్రముఖులను భగవానుని సాన్నిధ్యమునకు జతగూర్చెను.

ఈ హాలులో సుమారు ఏడువందలయాభైమంది పట్టుదురు. ఇచ్చట జరిగిన బాలవికాస్ సమావేశమునకు సుమారు 14 వందలమందితో వసారాలతోసహా హాలు పూర్తిగా నిండిపోయెను. అదే విధముగ భగవానుని ఉపన్యాసమునకు కూడ వేదికతోసహా సమస్త ప్రదేశములు క్రిక్కిరిసిపోయెను.

భగవానుని భక్తులును, రైల్వేమంత్రియు, అగు శ్రీ కె. హనుమంతయ్యగారు ఈ సమావేశమునకు అధ్యక్షత వహించిరి.

తరచుగా స్వామిని దర్శించుటకు వచ్చే వారిలో ఈయన ఒకరు. సమావేశ కార్యవర్గము తరపున శ్రీ సోహన్‌లాల్ అతిధులకు స్వాగతము పలుకగా శ్రీ హనుమంతయ్యగారు స్వామిని శ్రోతలకు సముచిత రీతిని పరిచయము చేసిరి. పిమ్మట డా॥ వినాయక కృష్ణగోకాక్ భగవానుని సంకల్పమును, సందేశమును, గూర్చి కొన్ని నిమిషములు సంభాషించిరి.

అనంతరము స్వామి ఈ నవీన యుగమున ఆధ్యాత్మికావశ్యకతను తదాధిక్యతనుగూర్చి ఉజ్వల సందేశమునిచ్చిరి. డా॥ భగవంతంగారు స్వామి దివ్యోపన్యాసమును అనర్గళముగ అనువదించిరి.

ఆ సమావేశమునకు ఢిల్లీనగర పురప్రముఖులను ఆహ్వానించిరి. అన్ని వర్గముల ప్రతినిధులు అందుగలరు. మార్చి 30 వ తేదీన 'మదర్లాండు' అను ఒక ఢిల్లీ పత్రిక ఈవిధముగ వ్రాసెను. "ప్రభుత్వమంత్రులు, మాజీ గవర్నరులు, మాజీ మహారాజులు, అగ్రశ్రేణి పారిశ్రామిక వేత్తలు, ప్రభుత్వాంగపు పెద్దలు, విదేశరాయబారులు, ఉన్నతోద్యోగులు, చిత్రవిచిత్రములగు వేషభాషలలో చెలువొందు పరదేశీయులు, నవీన నాగరికతతో మట్టిపడు నారీమణులు, వేయేల, ఆర్థిక, సాంఘిక రాజకీయ వైజ్ఞానికాది సమస్తరంగములలో పేరువడసిన పెద్దలందరు ఈ సమావేశమునకు హాజరైరి."

"హాలులో ప్రవేశించుచుండగా దృక్పధమున పడిన పెద్దలలో కొందరు శ్రీ కరన్‌సింగ్, శ్రీ హనుమంతయ్య, శ్రీమతి

ఐ. కె. గుజ్రాల్ సర్దార్ ఉజ్జుల్‌సింగ్ దంపతులు, శ్రీ ధర్మవీర భారత నౌకాదళ సేనాధిపతి అడ్మిరల్ యస్. యమ్. నంద్, అమెరికా రాయబారి శ్రీ కెన్నెత్ కీటింగు, భారత న్యాయాధిపతి గౌ॥ శ్రీ యస్. యమ్. సిక్రీగారూ గలరు.

'సండే స్టేండర్డు' విలేఖరి 'ఏరియల్' ఏప్రియల్ 9 న ఈ విధముగా వ్రాసెను. "భారతావనిలో పేరెన్నికగన్న మహనీయులలో నొకరును, మహాయోగియునగు శ్రీ సత్యసాయిబాబా వారు గడచినవారము ఢిల్లీనగరమున పాదమూని పురమును హస్తగతము చేసికొని అఖండ విజయమును సాధించిరి. వివిధ వర్గములకు చెందిన ఢిల్లీపౌరులు ఏ విధమగు ప్రకటనలు లేకయే బాబాకు యిచ్చిన ఘనస్వాగతము ఈ 'ఏరియల్' కొన్ని సంవత్సరములుగా మరెందును కాంచలేదు."

శ్రీ సత్యసాయి సేవాసమితివారు స్వామి మీరట్‌ను పర్యటించి, అచ్చట వేలాది భక్తులకు దర్శనభాగ్యమొసంగవలసినదిగా స్వామిని ప్రార్థించగా ఢిల్లీకి అనతిదూరములో 40మైళ్ళ లోపులోనున్న మీరటుకు మార్చి 31, 1972 మధ్యాహ్నము కేవలము వారి భజన సమావేశమునకు మాత్రము వేంచేయుటకు అంగీకరించిరి. సమితివారు మీరట్ స్టేడియములో భజన సమావేశమునేర్పాటు చేయగా వేలకువేలు అచ్చటకు వచ్చియుండిరి. అచ్చటి వాలంటీర్లు స్వామి దర్శనావకాశమును యితరులకు కల్గించుటకు బదులు వారేపొందు ప్రయత్నములో నుండుటచే మైకులు

పనిచేయక కొంత లలజడి కలిగినది. స్వామి, స్టేడియము ముఖ ద్వారమున పేచియున్న కారుచెంతకు వచ్చివేసిరి.

కాని మార్గమధ్యమున జరిగిన కొన్ని సంఘటనల వలన స్వామిని ఆ ప్రాంతపు సామాన్యజనులెంత సన్మానించిరో తేట తెల్లమగును.

మోడీ యిండస్ట్రియల్ టౌన్‌షిప్ గ్రామజనులు స్వామిని స్వాగతము చేయుచు మనోహరముగు ద్వారమొకదానిని నిర్మించి దానివద్ద వారందరు స్వామిదర్శనమును, సాధ్యమయి నచో పాద నమస్కారమును పొందు తరుణమునకై వేచి యుండిరి. స్వామి వారిని ఆశీర్వదించగా మీరట్ సమావేశ సమయము ఆలస్యము గాకుండుటకై వారు దారిని తొలగిరి. స్వామి బృందము వారి కార్లు, పోవుచుండగా యితరకారులు, మోటారుసైకిళ్ళు, రిక్షాజనము సంరంభముతో స్వామిని గుర్తించి. ఒండొరులతో చెప్పుకొనుచు అమితోత్సాహమున వారును వెంబ డించిరి. ఉత్తరభారతప్రజ యింతదనుక స్వామినామము పటము లలో స్వామిరూపము మాత్రమే యెరిగి యున్నారు. యిప్పుడు స్వామిని ప్రత్యక్షముగా చూచి యుండుటచే వారి ఆనం దము వర్ణనాతీతము. వారు స్వామికి యిచ్చిన స్వాగతము అనదృశము.

పంజాబు-హర్యానా ప్రాంతమున ప్రసిద్ధికెక్కిన కురుక్షే త్రమునకు స్వామి వెడలిరి. ఈ పర్యటనయు సర్వవిధముల

చిరస్మరణీయ మయ్యెను. ఇందు బొంబాయి రాష్ట్రమంత్రిగా, కేంద్రమంత్రిగా, స్వల్పకాలము భారతప్రధానమంత్రిగా, రాజ్య భారమును నిర్వహించిన శ్రీ గుల్జారిలాల్‌నందా భారత సంస్కృతిని పునరుద్ధరించి ప్రచారముచేయు నిమిత్తమై అనేక సంస్థలను స్థాపించి నడపుచు స్వామి ఆమోద ఆశీర్వచనములకై వారిని ఆహ్వానించిరి. స్వామి అందుల కంగీకరించిరి.

పంజాబ్, హిమాచలప్రదేశ్ పందలి భక్తులు సాయి ఉద్యమములో ముందంజ వేసిన చండీఘర్, లూదియానా, జలంధర్, సిమ్లా, మొదలగు సాయీకేంద్రములను స్వామి పర్యటించి యుండవలసినదని అభిప్రాయ పడిరి. కాని కురుక్షేత్ర పర్యటనము ఏమియు తీసిపోక అన్నివిధముల నుగ్గడింపజాలి యున్నది. ఇచ్చటకు స్వామి దర్శనార్థము మూడు రాష్ట్రముల నుంచి, కేంద్రపాలిత ప్రాంతములనుంచి, సుమారు లక్షన్నర జనము వచ్చియుండిరి. వారందరు ఏ విధమగు అసౌకర్యము లేక కూరిమిగూర్చు తమస్వామిని కన్నులారాగాంచి, వారిమాటలను వీనులారావిను, సావకాశము చిక్కునట్లు పందలకొలది పోలీసుల బందోబస్తుతో తదితర విధములుగ సమగ్ర ప్రయత్నము లొనరించిరి.

.. సమావేశము కురుక్షేత్ర విశ్వవిద్యాలయపు సువిశాలమగు క్రీడారంగమున జరిగెను. శ్రీనందా, రాష్ట్రగవర్నరు, విశ్వవిద్యాలయాధ్యక్షుడు రాష్ట్రముఖ్యమంత్రి ఆర్థికమంత్రి మున్నగువారు స్వామిని స్వాగతించిరి. అదియొక అపూర్వమగు మహాద్భుత

సమావేశము. అమెరికానుంచి వచ్చిన ఒక సాయి భక్తుడు రిచర్డుబాక్ అమనాత దద్దానిని చిత్రీకరించుచు తానెన్నడట్టిసన్ని వేశమును ఫిల్మ తీయలేదని తెల్పి యుండెను. సాగరమున తేలియాడు వటపత్రశాయివలె ఆ జనమహాసముద్రమున మన స్వామి చిట్టిసాయిగ వేదికపై నడయాడుచు కన్పట్టెను.

స్వామి ఢిల్లీలోయున్న యెనిమిదిరోజులు యింటర్వ్యూల కొరకై ఢిల్లిలో ఉన్నతపదవులనలంకరించిన స్త్రీ పురుషులు పలువురు యెడతెగక స్వామిని అభ్యర్థించుచు వచ్చిరి. అన్ని వృత్తులవారును స్త్రీలనక పురుషులనక స్వామి దివ్యజ్ఞాన సంపత్తుయొక్క మధురానుభూతిని పొందగోరిరి. స్వామి స్వల్పవ్యవధిలో అందరి మనోరథములను తీర్చుట దుర్లభమేయైనను చాల మందికి స్వామితో సమావేశము తటస్థపడెను. భారత ఉపరాష్ట్రపతి శ్రీ జి. కె. పాఠక్‌తో విందారగించు సందర్భమున ఢిల్లీ పౌరులలో ముఖ్యాతిముఖ్యులచట స్వామిని సందర్శించుకొనిరి.

ఆర్థికమంత్రి శ్రీయశ్వంతరావు చావన్‌గారు, రక్షణమంత్రి శ్రీ, జగజ్జీవన్‌రామ్‌గారు విమానశాఖామాత్యులు డా॥ కరణ్‌సంగ్ గారు, పారిశ్రామికమంత్రి శ్రీఖాదిల్కర్‌గారు, విదేశవాణిజ్యమంత్రి శ్రీ యల్. యన్. మిశ్రగారు రక్షణసామగ్రినిర్మాణమంత్రి శ్రీ వి ఁసీవ్. శుక్లాగారు స్వామిని కలిసి కొంతసేపుముచ్చటించిరి. శ్రీ చావన్‌గారి ప్రార్థనమ న్ననుసరించి స్వామి. వారి గృహమును కూడ పావనము చేసిరి.

శ్రీమతి ఇందిరాగాంధి కుటుంబీకులు గోల్ఫ్‌లింక్స్‌రోడ్డు

వ గల స్వామి నివాసమునకు పలుమార్లు వరతెంచి స్వామితో అమూల్య కాలమును గడిపిరి. శ్రీమతి ఇందిరాగాంధీకి యోగ శిక్షణ నొసగు శ్రీ ధీరేంద్ర బ్రహ్మచారిగారితో కొంతకాలము ఉండెను.

సర్వోదయ నాయకుడగు శ్రీ జయప్రకాష్ నారాయణ్ సతీ సమేతముగా స్వామితో కొన్ని ఆనందక్షణములు గడపెను. శ్రీమతి విజయలక్ష్మి పండిట్‌గారు శ్రీమతి హిరేణ ముఖర్జీ గారుకూడ స్వామిని సందర్శించిరి,

అమెరికా రాయబారి శ్రీ కెన్నెత్ కీటింగు, నెదర్లాండ్సు అంబాసిడర్ శ్రీ కలోక్యరన్, ఆఫ్ఘనిస్తాన్, అంబాసిడర్ శ్రీ అబ్దుల్ హకీం తఖేలిగారు కెనడా, స్పెయిన్, యిరాక్ మున్నగు దేశముల రాయబారులు, స్వామి దర్శనకాంక్షులై వచ్చిరి. శ్రీ కెన్నెత్ కీటింగుతో టీత్రాగువేళ స్వామి రాయబారికి అంగుళీయకమును సృష్టించి యిచ్చిరి. ఆ ఉంగరము రాయబారి చేతి వ్రేలికి కొంచెము వదులు ఆయెను. ఈ సంగతి స్వామియే ప్రస్తావించుచూ, అది బిగుతు కాగలదు. ఏ విధముగ అదివచ్చినదో అవ్విధముననే అది బిగుతునూ కాగలదని చిరునవ్వుతో వచియించిరి. టీ సమయము పూర్తియగుసరికి ఉంగరము దానంతట అదే బిగుతు అయిన సంగతి శ్రీ కీటింగు ఒప్పుకొనెను.

అడ్మిరల్ నందాయింట విందు సందర్భమున భారతసర్వసేనాని జనరల్ మానిక్ షా, వాయు సేనాని మార్షల్‌లాల్

స్వామిని దర్శించిరి: జనరల్ ఖన్నాకూడ స్వామిని కలిసిరి. సుప్రీమ్‌కోర్టు ఉన్నత న్యాయాధిపతి శ్రీ యస్. యమ్. సిక్రియు సిక్రీ సతీమణియు, ఉత్తరప్రదేశ్ ఉన్నత న్యాయాధిపతియు, న్యాయాధిపతి వైద్యలింగమ్, డిల్లీరాష్ట్రపు లెప్టినెంటు గవర్నరు, వీరందరుకూడ భగవానుని దర్శన భాగ్యమును పొందిరి.

మంత్రిమండలి కార్యదర్శి శ్రీ స్వామినాథన్ భారత ప్రభుత్వ వ్యవసాయ కార్యదర్శి శ్రీ టి. పి. సింగ్, ఆర్థిక సలహాదారు శ్రీ సుందరరాజన్, ఆర్థిక తణిఖీదారు శ్రీ ఖన్నా మొదలగు ఉన్నత ప్రభుత్వోద్యోగులు స్వామి చెంతకేతెంచిరి.

విశ్వవిద్యాలయ సంస్థ అధ్యక్షుడు డా|| డి.యస్ కొఠారి వారి సతీమణి, భారత ప్రభుత్వ విద్యాశాఖ సలహాదారు శ్రీ చిత్కారా, మరియు ఫిల్ము పరిశ్రమ '' పేరుగాంచిన శ్రీ యమ్. సునీల్‌దత్, శ్రీమతి నర్గిస్‌గార్లు స్వామిని చూడవచ్చిన వారిలో కొందరు.

పత్రికా ప్రపంచములో స్వామిని దర్శించిన వారిలో ప్రముఖులు "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" సంపాదకుడు శ్రీ ఫ్రాంక్ మోరేస్ (ఏరియల్) ఈయన భగవానునితో సుదీర్ఘకాలముఇంట ర్వ్యూ పొందగలిగెను. ఏప్రియల్ 9 1971 "సండేస్టేండర్డు"నందు ఈయన ఈవిధముగా వ్రాసెను. "ఏరియల్‌కు సాధువులన్ననూ యోగులన్ననూ గురిలేదు. వారిని యేమాత్రము పట్టించుకొను అలవాటును లేదు. సాయిబాబానుకూడ అట్టి వర్గము వారిలో ఒకరుగా తలంచుటచే వారియందుకూడ ప్రథమములో గౌరవ

భావము కలుగలేదు. వారితో నడచిన సుదీర్ఘ సంభాషణతో తొలుత ఆసక్తి పిమ్మట వారి సార్వత్రిక భావాభిప్రాయముల యందు సమాదరణ కలిగి వారొక అసామాన్య అప్రతిమాన మహావ్యక్తి అను భావము దృఢపడెను. ఆయన ఏరియల్‌కు ఒక అంగుళీయకమును, ఒక శిలానిర్మితమగుశిలువను సృష్టించి యిచ్చిరి. వీటికంటెనుగూడ ఆయన గుణగ్రహణ పారీణత, సంభాషణా చతురత, భావ వైశిష్ట్యము ఏరియలును ఆకర్షించి గాఢ ముద్ర వేసినవి''

భగవానుని సందర్శించ వచ్చిన వారల జాబితాకిది తుది కాదు. స్వామి ప్రేమతో ప్రసాదించు శాంతి, ఆనందములు పొందగోరి యింకా యెందరో స్వామిసంచ జేరిరి. ఏరియలు వ్రాసినట్లు స్వామి ఢిల్లీ వశము చేసికొనుటయేగాక తానానగరపౌరు లకు చిన్న మొదలు పెద్దవరకు. సామాన్యునిమొదలు పాలక వర్గములోని పైమెట్టువారి వరకు పరిపూర్ణముగా వశుడయి సర్వ విధముల వారి ఆనందాభివృద్ధుల నభిలషించి అనుగ్రహించిరి.

ఏప్రియల్ 3, 1972 ఉదయము గోల్ఫ్‌లింక్స్‌రోడ్ యందు ఒక అనిర్వచనీయమగు సన్నిధి గోచరించెను. సూర్యో దయము పూర్వమే భక్తులు సెలవు తీసికొనవచ్చిరి. ఒకవారము రోజులు 16, గోల్ఫ్‌లింక్స్‌రోడ్ ఒక మహాద్భుత శక్తిసహాయ మున ఒక మహా సముద్రతీరమునకు 'గొంపోబడి, అచ్చటి, అనవరత మహోత్తుంగ తరంగ ఘన నిస్వనమనెడి విచి త్రానుభూతిని పొందగలిగెను. తిరిగి అదే శక్తి దానిని యథా

స్థానమునకు తెచ్చుటచే ఈ మార్పు ఆ ప్రదేశమునకు ఏ విధముగ పరిష్వచ్ఛకొనెనో ఊహకందనిది. అశ్రుపూరిత నయనములతో వేదనామయమైన వీడ్కోళ్ళతో స్వామి పాలమ్ విమానాశ్రయము చేరిరి. వచ్చిన భక్తబృందమును క్రింద విడువగనే పైన విమాన ప్రయాణీకులు, మరి విమాన చోదకులు స్వామిని చుట్టుముట్టిరి ....అవతారికి ఎచ్చోటను అవ్యవధియేకదా।

వినాయక కృష్ణ గోకాక్

పాపపుణ్యముల తారతమ్యములు తెలివిలేక, యే ఒక హద్దులేక, జీవితమును గడిపితే, అది పశుజీవితముకన్న నీచమే. మానవుడు అమృతపుత్రుడు; వాని దేహము ఒక దేవాలయము. దానిలో ఈశ్వరుడే ప్రతిష్ఠితుడైనాడు. మానవుడు మట్టి,మాంసము మర్కటమునుంచి పుట్టలేదు। వాడు అమృతబిందువు. ఈనాడుమానవుని అమృతస్వరూపుడని అనడమే హాస్యాస్పదముగా నున్నది, ఎందుకనగా వాడు వికారమైన సందేహములను ప్రదర్శించుకొని వాటికి సమాధానముకావలెనని నెమ్మదిగా కూర్చున్నాడు। అయితే నిజముగా మన భగవద్గీతలో అన్ని సందేహములకు సమాధానము లున్నవి। మనిషికి వెనుక యేదో ఒకదివ్యశక్తియున్నది; ఆ శక్తియే పరమాత్ముడు దాని వలననే వాడు అన్నిపనులు చేయుచున్నాడు అని శ్రీకృష్ణుడు అర్జునునికి స్వయముగా తెలిపినాడు. అయితే, మనది మనకు రుచించదు. మనయింటి పంచభక్ష్యపరమాన్నములకంటె, ప్రక్కయింటి పాసిపోయిన పప్పు రుచిగా నుంటుంది.

(బాబా)



# భగవానుని ఢిల్లీ ప్రయాణము



శ్రీ బాబావారు సుమారు 11 సంవత్సరముల తరువాత మన రాజధాని అయిన ఢిల్లీనగరమునకు అనేకమంది భక్తుల ప్రార్థనల నంగీకరించి, శ్రీవారు వెళ్ళుటకై సంకల్పించిరి. మార్చినెల 21 సాయంకాలము బెంగుళూరునుండి ప్లేనులో హైదరాబాదు చేరిరి. అచ్చట నాలుగు రోజులు భక్తులందరికీ దర్శనమిచ్చుటయేగాక, 23 వ తేదీన శ్రీరామనవమి అతి వైభవముగా జరిపి అచ్చట నిర్మించుచున్న "శివం" అను సత్యసాయి మందిరమును చూచి సేవాసంస్థల కార్యకర్తలందరకు ప్రోత్సాహము నందించి, వేలాది భక్తులకు వారి దివ్య సందేశము నిచ్చిరి.

హైదరాబాదునుంచి 25 వ తేదీ సాయంకాలము ప్లేనులో ఢిల్లీ చేరిరి. ఢిల్లీవిమానాశ్రయములోను అచ్చటినుండి నగరమునకు పోవు దారిలోను ఢిల్లీస్టేటు ప్రెసిడెంటు శ్రీ సోహన్‌లాల్ గారి భవనమువద్దను, లక్షలకొలది భక్తులుచేరి శ్రీ బాబావారికి యింతకు పూర్వము యేనగరములోను చూచి ఉండనట్టి, అఖండ స్వాగతమువిచ్చి, వారి ఆనందమును వెలిబుచ్చిరి. ఢిల్లీలో భగవాన్ బాబా 25వ తేదీ సాయంకాలము మొదలు ఏప్రియల్ 3 ఉదయము వరకు విచ్చేసియుండిరి.

శ్రీ బాబావారు ఢిల్లీలో ఉన్న అన్ని రోజులు ఉదయము సాయంకాలము, శ్రీ సోహన్‌లాల్‌గారి భవనమునకు ప్రక్కనే యున్న స్థలములో సుందరమైన అలంకారములతో నిర్మించిన పందిరిలో వేలాది భక్తులుచేరి భజనలుచేసి భగవానుని దర్శనము చేసికొని యెంతో ఆనందమునుపొంది వారివారి భక్తి పారవశ్యమును వెలి పుచ్చిరి. అచట యేర్పాటుచేసినచోటు చాలక, ప్రతి రోజు లక్షమందికి పైగా వచ్చి, భవనముచుట్టునున్న రోడ్లమీదను ఖాళీస్థలములలోను, చూపుమేర ఎచ్చటచూచినను, ప్రజలతోను కారులతోను, నింపివేసి, స్వామి దర్శనమునకై వారి ఆతురతను వెలి పుచ్చిరి.

రాజధాని నగరమగుటచే అచ్చటి పత్రికలలో అనేక తెగలకు చెందిన భక్తులు—అనగా రాజకీయవేత్తలు అధికారములో నున్న ఉద్యోగస్థులు, డాక్టర్లు, సినిమా తారలు, ధనికులు, విదేశములనుండి మన దేశములో రాజ్యాంగ విషయములకు సంబంధించిన పనులు చేయుచున్న రాజదూతలు, వారి ననుసరించి యున్న అధికారులు, అనేకమంది యాత్రాదులయి వేలాది....భగవానుని ఆశీర్వాదము నపేక్షించి, శ్రమలకు ఓర్చి, రెండు మూడు పర్యాయములువచ్చి, వేచియుండి, భగవానుని దర్శనము చేసికొని ఆనందముతో తిరిగి వెళ్ళిరి. ఇట్లు వచ్చినవారిలో, అమెరికా దేశమునుండి వచ్చిన శ్రీ కీటింగు మొదలైన రాజదూతలు, సుప్రీం కోర్టు ఛీఫ్‌జస్టిస్ శ్రీ సిక్రి మొదలైన న్యాయవేత్తలు, ....స్టేటు గవర్నరు; శ్రీ చవన్‌గారు; శ్రీ హనుమంతయ్యాగారు మొద

లైన మన కేంద్రప్రభుత్వ మంత్రులు ఢిల్లీపరిసరములలోనున్న ఎంతోమంది శ్రీమంతులు ఉండిరి. సామాన్య ప్రజలు....పురుషులు, స్త్రీలు, పిల్లలు, పెద్దలు, ఆరోగ్యవంతులు, రోగులు, లక్షలమంది అనేక శ్రమలకోర్చి ప్రతి దినము నగర సంకీర్తనలో పాల్గొని సాయంకాలము రాత్రి అయే వరకు అక్కడనే స్వామి దర్శనము చేసికొంటు ఉండెడివారు.

ఢిల్లీలో బారాకంబా రోడ్డులోనున్న మోడరన్ స్కూలు మైదానములో ఆదివారము 26 వ తేదీ సాయంకాలము సుమారు రెండు లక్షలమంది ప్రజలకు శ్రీ బాబావారు వారి దివ్య సందేశము నందించిరి. ఈ సమావేశములో ప్రజలకు అదే మొదటి సారి బాబావారి దర్శనమగుటచే అత్యంత ఉత్సాహమునుచూపి అందనేకమంది వారి ఆనందమును వెలిబుచ్చిరి.

కమానీ ఆడిటోరియములో ఢిల్లీ బాలవికాస్ వారిచే చక్కని కార్యక్రమములు మనోహరముగా భగవాన్ దివ్య సమక్షములో ప్రదర్శించిరి. అదే ఆడిటోరియంలో ప్రత్యేక ఆహ్వానితులైన వారికి ఒకరోజు సాయంకాలము శ్రీ బాబావారు వారి దివ్యసందేశమునందించిరి. ఇవిగాక భగవాన్ ఢిల్లీవదలివచ్చే ముందు అనగా ఆదివారము ఏప్రియల్ 2 వ తేదీ సాయంకాలము భక్తులందరకు శ్రీ సోహన్‌లాల్‌గారి భవనము ప్రక్కన వేసిన పందిరిలో దివ్యోపన్యాసము గావించిరి. వేరువేరుగా సేవాదళము వారిని బాలవికాస్ వారిని, సమితి సభ్యులను ఆశీర్వదించిరి.

ఢిల్లీలో ఉన్నకాలములోనే మీరట్‌మండి అక్కడి

సమితికార్యకర్తలు. కురుక్షేత్రమునుండి శ్రీ గుల్జారిలాల్‌నందా ప్రార్థింపగా భగవాన్ ఆ రెండు చోటులకు వెళ్ళిరి.

మీరట్‌లో ఉత్తరప్రదేశ్ అన్ని ప్రాంతములనుండి భగవాన్ రాకను గురించి తెలిసికొని ప్రజలు అసంఖ్యాకములుగా గుమిగూడిరి. అదివరకు యెచ్చటను జరుగనంత వత్తిడి కలుగజేసిరి. శ్రీ బాబావారి అనుగ్రహముచే అంతమంది ప్రజలు అక్కడ కూడినను ఎవరికీ ప్రమాదము జరుగకుండ అందరికీ దర్శనము లభించినది. మీరట్‌నుండి ఆరాత్రియే తిరిగి ఢిల్లీవచ్చిరి. మరుసటిరోజు అనగా ఏప్రియల్ 1వ తేదీన శ్రీవారు చాలమంది భక్తులు వెంటరాగా ఢిల్లీనుంచి కురుక్షేత్రమునకు వెళ్ళిరి. చరిత్రలో అసామాన్య పవిత్రతకు అర్హతకలిగియున్న ఈ కురుక్షేత్రమను దివ్యక్షేత్రమునకు అవతారపురుషులైన భగవానులు ఈ యుగ యుగములో వేంచేయుట సాటిలేని ఘట్టమని చెప్పవచ్చును. అచ్చట హర్యానా, పంజాబు రాష్ట్రములనుండి వచ్చిన లక్షల కొలది భక్తులు, శ్రీ నందాజీ, వారి అనుచరులు శ్రీ బాబావారికి అఖండ స్వాగతమునిచ్చిరి. నందాజీచేయు సత్కార్యములన్నియు సందర్శించిన అనంతరము భగవాన్ కురుక్షేత్ర విశ్వవిద్యాలయమైదానమున ఏర్పాటు చేసిన సభలో వారి దివ్యసందేశము నందించిరి. అచ్చటి సమావేశము ఆ భక్తుల ఆనందము కన్నుల పండుగగా నుండినవి. కురుక్షేత్రము దివ్యక్షేత్రమనియు అచ్చటి కొకప్పుడు మహావీయులు దైవాంశసంభూతులును అయిన పాండవులు సంచరించిరనియు, భగవంతుడైన శ్రీకృష్ణుడే భగవద్గీత

నుపదేశించిన దివ్యస్థలమనియు. ఈ కారణముల చేతనే చరిత్రా త్మకమైన పవిత్రత కలిగిన క్షేత్రమనియు శ్రీ బాబావారు సెల విచ్చి, ఆభక్తులందరిని తమతమహృదయముల దైవముపై మరల్చు కొని పవిత్రము గావించుకొనవలెనని ఆజ్ఞాపించి ఆశీర్వ చిరి. ఈ సంఘటన వారందరకు పూర్వజన్మ సుకృతము వల ననే ప్రాప్తించినదనియు అచ్చట ఉన్నవారందరు భావించిరి. శ్రీ నందాజీని. వారిప్రయత్నములన్నియు సత్కార్యములగుటచే తప్పక సఫలములగునని దీవించిరి. శ్రీ నందాజీ ఆనందభరితుడయి భగ వానుని పాదపద్మములకు నమస్కరించెను. ఆ రాత్రియే బాబా ఢిల్లీకి తిరిగి వచ్చిరి.

ఏప్రియల్ 3 వ తారీకు ఉదయము ఢిల్లీలోని భక్తులు ప్రజలు కార్యకర్తలు యింకను ఢిల్లీలో కొంతకాలముండమని ప్రార్థించినను. పుట్టపర్తిలో పనులు చూడవలసిన అవసరముండు టచే శ్రీ బాబా తిరిగి ప్లేనులో బెంగుళూరు విచ్చేసిరి.

'72 మే నెల పూర్తిగ, 31 దినములు, వైట్‌ఫీల్డులోని బృందా వనమునందు, శ్రీ సత్యసాయి కాలేజీలో, శ్రీవారి సన్నిధిని, శ్రీవారి ఆధ్వర్యమున, శ్రీవారి దివ్యోపన్యాసములతో సహా, జరుగు, ఆల్ ఇండియా కాలేజీవిద్యార్థులసమ్మర్‌కోర్సు'' (ఆధ్యాత్మికవిద్య మరియు భార తీయ సంస్కృతిని గురించి) కు సంబంధించిన వివరములు జూన్ నెల పత్రికలో ప్రచురింపబడును. [సం.]

# అమ్మకు శ్రద్ధాంజలి

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి తల్లిగారైన ఈశ్వరాంబ గారు 6-5-72 ఉదయము 'బృందావనములో' దివంగతురాలైనారని తెలిసికొని పాఠకులు విచారగ్రస్తు లగుదురు. స్వామి ఆసమయములో ఆమె సమక్షములోనేయున్నకారణమున చివరిక్షణ ముదాకా హాయిగా విశ్రాంతగా గడిపి మందహాసములను చిందించుచూ, జీర్ణవస్త్రమును త్యజించు స్థితిలో ఆమె భౌతిక కాయమును సునాయాసముగా త్యజించి పరమాత్మలో లీనమైరి. ఆమె వయస్సు ఎనుబది సంవత్సరములు అవతార పురుషుని మాతృమూర్తిగా, అతి గంభీరముగా. అత్యంత చాకచక్యముతో వ్యవహరించిరి. ఆమె కుటుంబములోనివారు, పుట్టపర్తివాసులు, చుట్టుప్రక్కల పల్లెలవాళ్ళు, లక్షలాది స్వామి భక్తులు. ప్రశాంతి నిలయమునకు వచ్చిన ప్రతిఒక్కరు, ఆమెను దయగల తల్లిగా ప్రేమను వెదజల్లు మాతగా, పూజించి సేవించి. వారివారి జీవితములనే ధన్యము చేసికొనినారు. ప్రతి దశరా ఉత్సవములోనూ బీదలకు నూతన వస్త్రముల నందించు సమయమున ఆమె మందహాసము మరపురానిది. స్వామి జన్మదినోత్సవమున పుష్పముతో స్వామికి ఆమె తలంటు సమయమున ఆ చిరునవ్వు వేలాదిభక్తుల హృదయఫలకములపై చెరగని చిత్రము. జగన్మాతయైన సాయి మాతకే మాతయైన ఆ మహాతల్లి పాదద్వయమునకు అంజలి

సమర్పించవలయునను కోరిక ప్రతి ఒక్కరిలో నుత్పన్నమయ్యె డిది. అవ్యాజ కరుణామూర్తియైన ఆ తల్లి మందహాసములో ఆనం దము ననుభవించెడివారు. అటువంటి మహాతల్లి తన కర్తవ్య కర్మలను సంపూర్ణముగా నిర్వర్తించుకొని పరిపూర్ణానందముతో లోకానికి లోకేశుని అప్పచెప్పి తనువును వీడిరి. పరమాత్మలో ఐక్యమొందిన ఆమె ఆశీస్సులు, వాత్సల్యము మనకు సర్వదా లభ్యమే.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారి తండ్రిగారైన శ్రీ పెద వెంకమరాజుగారు 4-11-63న దివంగతులైరి. పెదవెంకమరాజుగారి సమాధికి యెదమవైపున ఈశ్వరాంబగారి భౌతికకాయమును వేద ఘోష జరుగుచుండగా వేలాది భక్తులు భజన చేయుచుండగా 6-5-72 సాయంత్రము భూస్థాపితము చేసిరి. పూలతో అల ర్చిన అమ్మ భౌతికకాయమును ఊరేగింపుతో భక్తులు బంధు వులు తీసికొని వెళ్ళు సమయములోకూడ ఆమె మందహాసము చేయుచున్నట్లే అందరు భావించినారు. శ్రీ సత్యసాయి పాఠ శాల పిల్లలు యూనిఫారముతో బ్యాండువాయించుచూ, కొందరుపాఠ శాల పిల్లలు, కొందరు భక్తులు నామస్మరణ చేయుచూ. కొందరు పాఠశాల పిల్లలు వేదపఠనము గావించుచూ, ఆ ఊరేగింపుతో ప్రశాంతినిలయమునకు తూర్పువైపునున్న ఆవరణములోనికి అమ్మ భౌతిక కాయమును తీసికొనివెళ్ళు సమయములో పుట్టపర్తిలోను మందిరములోను ఎవ్వరూ లేరు. రోడ్లన్నీ క్రిక్కిరిసియుం డెను. రెండు ఫర్లాంగులదూరము ఆ ఊరేగింపు పోవుటకు

ఒకటిన్నరగంట పట్టెను. భూస్థాపితముచేయు సమయమున గ్రామస్థులందరు చేరినందువలన యిసుకవేస్తే రాలకుండా ఉండెను. అందరు అక్కడ అమ్మకు తమ శ్రద్ధాంజలి నర్పించిరి. అమ్మ జ్యేష్ఠపుత్రుడైన శ్రీ శేషమరాజుగారు అంత్యక్రియలను జరుపు సమయమున ఆమె కనిష్ఠపుత్రుడైన శ్రీ జానకిరామరాజుగారు సహాయపడిరి.

ఆమెకు ఈశ్వరాంబ అని నామకరణము చేసినవారు భవిష్యత్తులోనికి తొంగిచూచినారా యని స్ఫురిస్తుంది.

నిజముగా ఈశ్వరునకే ఆమె అమ్మయని పాఠకులకు సువిదితమే గదా!

పత్రికలకుచందా కాని పుస్తకములకు మొత్తము కాని
"సనాతన సారథి", ప్రశాంతి నిలయము,
అనంతపురము జిల్లా
అనే అడ్రసుకే పంపవలయును. వేరు రీతిగా
(ఫౌండేషన్, , వ్యక్తి పేర్లు ఇత్యాది) అడ్రసు వ్రాసితే
స్వీకరింపబడవు.
క్రొత్త చందా పంపునపుడు, "క్రొత్త చందా" యని
వ్రాయండి. పాత చందాదారులు రెన్యూచేయునపుడు
తమ నెంబరులను వివరముగా వ్రాయవలెను.



# పుస్తక సూచి

1 పుస్తకముల వెలయూ పోస్టు మరియు రిజిస్ట్రేషను చార్జీలయూ మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 విలువలోనున్న పుస్తకములు వాటి పోస్టు చార్జీలు క్రింద తెలియ చేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్ పోస్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలయూ పోస్టుచార్జీ మరియు ప్రతి ఆర్డరుతోనూ రిజిస్ట్రేషను చార్జీ రూ. 1-05పై జతపరచి, కావలసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| | తెలుగు: -- -- | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-15 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వచనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 11. | సాయిరాముడెవరు | 1-00 | 0-10 |
| 12. | బోధామృతము | 0-50 | 0-10 |
| 13. | సాయిమహిమ | 1-00 | 0-20 |

| | | | |
|---|---|---|---|
| 14. | లీలావాణి | 1-00 | 0-20 |
| 15. | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16. | స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |

కన్నడం: — —

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. | ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. | సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. | ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. | ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము: — —

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం (2) | 4-00 | 0-40 |
| 2. | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. | గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. | వచోరత్నంగళ్ (1) | 2-00 | 0-20 |
| 5. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| | అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. | డివైన్ వార్నింగు ది స్టూడెంట్సు | 1-00 | 0-15 |
| 8. | ధర్మ వాహిని | 1-00 | 0-10 |
| 9. | జ్ఞానోపదేశ రత్నాంగళ్ | 1-50 | 0-25 |

ఇంగ్లీషు:

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయి స్పీక్స్ (1భా) | 4-00 | 0-25 |

| | | | |
|---|---|---|---|
| 2. | సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-00 | 0-30 |
| 3. | .. .. (3భా) | 4-00 | 0-30 |
| 4. | .. .. (4భా) | 5-00 | 0-40 |
| 5. | .. .. (5భా) | 5-00 | 0-40 |
| 6. | .. .. (6భా) | 5-00 | 0-40 |
| 7. | ,, .. (7భా) | 7-00 | 0-65 |
| 8. | సెలక్టెడ్ జ్యూయల్స్ (పద్యములు) | 1-50 | 0-10 |
| 9. | సాయిబాబా [అమెరికన్ ఎడిషన్ సత్యం శివం సుందరం (1)] | 6-00 | 0-40 |
| 10. | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 11. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 12. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 13. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 14. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 15. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 16. | భాగవతవాహిని | 5-[illegible] | 0-40 |
| 17. | భజన్ సాంగ్స్ | 2-00 | 0-20 |

అరవం: ——

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ భా) | 3-50 | 0-40 |
| 4. | .. .. .. (2వ భా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-15 |
| 6. | అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | సాయిమాల | 1-00 | 0-10 |

| | | | |
|---|---|---|---|
| 9. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 10. | సందేహనివారిణి | 2-00 | 0-25 |

**హిందీ:**——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

**బెంగాలి:**——

| | | | |
|---|---|---|---|
| 1. | ధ్యానవాహిని | 1-75 | 0-10 |

**గుజరాతి:**——

| | | | |
|---|---|---|---|
| 1. | అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. | కథాసుధ | 2-00 | 0-15 |

**సింధి:**—

| | | | |
|---|---|---|---|
| 1. | భజనావళి | 0-50 | 0-10 |
| 2. | ధ్యానవాహిని | 1-00 | 0-15 |
| 3. | ప్రశాంతివాహిని | 1-50 | 0-10 |
| 4. | సత్యం శివం సుందరం (1వ భా) | 4-00 | 0.40 |
| 5. | ,, ,, (2వ భా) | 4-00 | 0-40 |

మేనేజర్, సనాతన సారథి



